శ్రీశారదాంబాయైనమః

ఓమిత్యేకాక్షరంబ్రహ్మ

శ్రీగురవేనమః

# స్త్రీవిద్యా—ఉపన్యాసమంజరి.

అనుసీ చిన్నిపాత్రము

గుంటూరుతాలూకా నంబూరుగ్రామ వాస్తవ్యులును
రాచసెరికి కులాలంకారుండును మద్దికలగోత్రపవిత్ర
తులాబంధుల వంశపయఃపారావార రాకాసుధాకర
సుబ్బయాఖ్య ద్వితీయపుత్రి సుకవిసవిధేయా
చిన్నబ్రాహ్మణాఖ్యునిచే రచియింపఁబడి
రామపాదభక్తితత్పరురాలును నీతికోవిదురాలును
సద్ధర్మవంతురాలును నైన కత్రిక చిలకమ్మగారొసంగిన
ద్రవ్యసహాయముచేఁ బ్రకటింపఁబడియె.

గుంటూరు వాణీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1912.

వెల 0-1-0.



శ్రీ

శ్రీగురుభ్యోనమః

# స్త్రీవిద్యోపన్యాసమంజరి.

ఉ॥ శ్రీరమణీయమై సుజనసేవితమైన యధర్మలీల సం।
బూరిపురంబునఁ గలదు పూరితగ్రంధకదంబరాజముం।
మూరిజనాళికెల్లరకు చొక్కపుశయ్యయు శారదాలయ।
జేరినివృద్ధిసేయగను వేడెద శ్రీలలితాంబ పాదముల్॥

గీ॥ శ్రీరమాధవ కేశవ సింధుశయన।
పక్షివాహన భద్రేభపాల శ్యామ।

లాంగసుందరదైత్యారి లలితమూర్తి!
వందనంబులొనర్తును వరదగౌరుము॥

ఆ॥ గిరిజప్రాణనాథ కిల్బిషకానన!
వీతిహోత్రదేవ వృసభవాహ!
నిన్ను నమ్మినాను నిగమసంచారక!
బ్రోవుమయ్య శూలి పూర్ణదయను॥

కం॥ రాధామణి హృత్సదనా!
బోధాయనఋషినుత భక్తపుంగవరక్షా!
భూధరధరమురారీ!
మాధవకరుణింపునన్ను మానితవేషా॥

ఆర్యులారా? స్త్రీవిద్యనుగూర్చి మీరనేకపర్యాయములువినియున్ననూ అల్పవిద్యాంతుడనగు నేనిదియె ప్రథమయత్నముగా నొక యుపన్యాసము నిచ్చుటకు గుతూహాలుండనై సాహసించితిని. యిందెట్టి లోపములున్నను నొప్పరికించక యొప్పులనే బరిగ్రహించమిమ్ములను హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాడను.
స్త్రీలకుగాని పురుషులకుగాని వివేకమునొసంగు

టకు విద్యయనునదే మూలవిత్తము.

విద్యాలాభమునుగూర్చి భారతములో.

గీ॥ విద్యయొసగును వినయంబు వినయమునను।
బడయు బాత్రత బాత్రత వలన ధనము।
ధనమువలనను ధర్మంబు దానివలన।
నైహికాముష్మికసుఖంబు లందు నరుడు॥

భర్తృహరియను కవిశిఖామణిలాగున జెప్పియున్నాడు.

ఉ॥ విద్యనిగూఢగుప్తమగు విత్తమురూపము పూరుషాళి
విద్యయశస్సుభోగకరి విద్యగురుండు విదేశబంధుఁడున్ [కిన్
విద్యవిశిష్టదైవతము విద్యకుసాటి ధనంబులేదిలన్
విద్యనృపాలపూజితము విద్యనెఱుంగని వాడుమర్త్యుడే॥

మహారాజరాజశ్రీ రాయబహదూర్ కందుకూరి
వీరేశలింగం పంతులు వారీవిధమున
జెప్పియున్నారు.

గీ॥ విద్యనేర్చినదొలుతను వినయమబ్బు।
వినయమునసర్వగుణములు వెలయుమిగుల।
వానిచేతనుపతిభక్తి వాదుకొనును।

కావునను సుందరులు విద్య గఱపవలయు॥

గాన విద్యయనగా జ్ఞానమునిచ్చుపదార్థము. జ్ఞానమనగా యజ్ఞానాంధకారము నశింపజేయు వెలుతురునిచ్చువస్తువై యున్నది. జ్ఞానమనే వెల్తురుసహాయమువల్ల, ఇది మంచి ఇది చెడ్డ ఇది చేయవలసిన కార్యము ఇది చేయరాని కార్యము అనివివక్షత జ్ఞానము నొసంగును గనుక స్త్రీపురుష భేదము లేకుండా ప్రతిమానవునికి జ్ఞానమవుసరమనిన్ని అట్టి జ్ఞానమును సంపాదించుటకు విద్యయుండి తీరవలెననిన్ని నేను నొక్కి వక్కాణించుచున్నాడను

తే॥ గీ॥ జ్ఞానమున కాటపట్టును గావరమున।
కాకరంబున సిరులకు నాశ్రయంబు।
బరమపదమునకును రాజపథముగాన।
జదువునకు సాటిసంపద జగతిగలదె॥

గావున పురుషులకు విద్య అవుసరమనిన్ని స్త్రీలకు విద్య అనవుసరమనిన్ని స్త్రీలు విద్యలు నేర్చి లోకముద్ధరింపనా? ఊళ్ళేలనా? పొయ్యగనిపెట్టుక నొకమూల కూర్చుండజేసి యువతులకు విద్యయేందుకని వాదించుచు

హానుభావుఁకు నేఁజెప్పఁబూనిన యుత్తరంబెద్దియన చి
రకాలంబునుండి తమహృదయాల వాలమునందు పాదు
కొని యల్లిబిల్లిగా నల్లుకొనియున్న దురాచారపు పిశా
చపువలపునుండి దొలఁగుసాధనమును గానకతమయసము
ద్ధితనుగప్పి పుచ్చుకొనునుపాయంబు వెదకుచు దాముప
ట్టినకుందేటికి మూఁడేకాళ్ళయనియు పంచపాండవులన నే
నెఱుఁగనా మంచముకోళ్ళవలె ముగ్గురేగదాయనియు అల్ల
మన్న నెఱుఁగనా బెల్లమువలె పుల్లగనుండుననియు మొం
డివాదనలఁజేయుచు కాలమువృథాపుచ్చు మూర్ఖశిరోమ
ణులుమాత్రము స్త్రీలకు విద్యనిషేధించెదరు. గాని సక
లవిద్యాసంపన్నులును పురస్సరాగ్రగణ్యులును నైన సజ్జను
లుతమశక్తికొలఁదిఁబ్రోత్సహించుచు స్త్రీవిద్యనుబలపఱ్చి దానిన
భివృద్ధికిఁ దెచ్చెదరని నమ్ముచున్నాను. ఆంధ్రభాష
యను పూర్ణచంద్రబింబమును కాపాడఁదలంచి అచ్చట
చ్చట పాఠశాలలనుస్థాపించి విద్యాభివృద్ధిచేయుచు
న్ననూ పూర్వపుస్త్రీలచారిత్రము నెఱుఁగమిచే అంధకా
రబంధురములో మునిఁగి స్త్రీలకు విద్యకూడదను పిశాచి

నివదలకున్నారు.

పూర్వకాలంబున స్త్రీలు పెక్కు విద్యలు నేర్చి తమవిద్యాప్రౌఢిమచే రాజసభల పరమహంసాది బిరుదములను రాచకార్యంబుల మంత్రిపదవులున్నూ ధైర్యసాహసంబుల సేనానాయకత్వాదులంది యెన్నరానిమన్ననలకు లోనైనట్లు పెక్కుచోట్ల గానంబడుచున్నది. అప్పుడట్టివారుండుటంబట్టియె యీహైందవ దేశంబు సకలరత్నంబుల కునికిపట్టై ధర్మంబునకాధారంబై ఫలభరితవృక్షాభిరామంబై అవిరళధనసమృద్ధంబై పతివ్రతలకాకరంబై యెల్లరాజ్యంబులకు బుట్టినిల్లై దైవభక్తికిక్కయై మారిమహామ్మారి కాటకాది దుర్భిక్షభయంబులు లేకస్వకాయకష్టజీవులచే భాసమానమైయుండెడిది. పూర్వము ఖండైశ్వర్యమనుభవించి ఇటీవల మనస్త్రీలకువిద్య గఱపుటెప్పటినుండి మానితిమో అప్పటినుండి మనకిట్టియిక్కట్టులు వాటిల్లినవి. జగద్విఖ్యాతయశస్సాంద్రుడగు స్వామి వివేకానందయతిచంద్రుండు సహితము తానిచ్చిన

యుపన్యాసంబుల స్త్రీలకువిద్యనేర్పి వారిని మంచిదశకు దెచ్చువరకునుమనదేశము బాగు పడదనియుహిందూమత ధర్మంబుల పరదేశంబుల వెదజల్లుసమయంబుల నైరులుతనకొనరించు పెక్కు యిక్కట్టులను స్త్రీలసహాయంబుచే దప్పించుకొంటిననియు జెప్పియున్నారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర రామమోహన దయానందాది మహామహులెల్లరు స్త్రీవిద్యా స్త్రీస్వాతంత్ర్యములకు తమజీవితములుధారనోయుటయెల్లరకు గరతలామలకంబె. మనమునిష్పక్షపాతబుద్ధితో నిజానిజములు యోచింప మొట్టమొదట మనమెవ్వరిచేజన్మించితిమో గనుగొనుడు మనల నవమాసంబులుమోసి ప్రాణంబులపై నాసవిడనాడి ప్రసవించిబాలగ్రహాదియకాలసంభవరుగ్మతాదుల వాతబడకుండ నహర్నిశంబులు సద్ఘనౌషధంబుల సజీవులజేయు మానవతీమణులగాంచి మత్సరగ్రస్తులమాటకన్న మనకు హీనమైనదింకొకటున్నదా? శిష్టలను బెంచునప్పుడు వాండ్లకు మంచినీతులను దొడ్డగా బోధించి పరమోత్తమ

మయినకార్యములందు వాళ్ళబుద్ధివిలగులునటుల జేయు టకు విద్యావతియైనతల్లియే కారకురాలు కాబట్టి స్త్రీలకు మంచివిద్యనేర్పించుటయే నాముఖ్యకర్తవ్యము.

పూర్వముకొందరు నారీశిరోమణులు మనయా ర్యావర్తమునకు మానికములై వెలింగిరి, ఇకనువముజ్జగం బులుజయించి మించినక్రూరాగ్రేసరులగు రావణాదులచే జిక్కియును తమనిష్కళంక పాతివ్రత్యమును గాపాడుకొని నసీతాది పురాణచారిత్రలు మనభరతఖండమును బావ నముజేసియుండిరి.

మరియుననేక స్త్రీరత్నములు గణితశాస్త్రములు సహితముజేసివినుతికెక్కిరి. కావున ఏదేశమందు స్త్రీలు విద్యనేర్చెనో ఆదేశముమిగులప్రఖ్యాతిగాంచినదని చెప్పుట కుచరిత్రములేసాక్షి పూర్వమీహిందూదేశమందనేక స్త్రీ లు రాజ్యపరిపాలన మున్నగు రాచకార్యములయందారి తేరి ఘనకార్యములనేకులునిర్వహించి కీర్తినందినట్లును మరికొందరుస్త్రీలు విద్యాధిక్యతగల్గి యోగినులై యజ్ఞా నజనులకు సుబోధనల జేయుచులోకోపకారిణులైనట్లును

ననేక పురాతనగ్రంథములమూలమున మనకుదెలియవచ్చుచున్నది. గ్రంథవిస్తరభీతిచే వానినిచట వ్రాయుట మాని గొన్ని కొన్ని యుదాహరణములతో ముగించుచున్నాను. పూర్వకాలంబున స్త్రీలకుపనయనములున్నూ, సంధ్యావందనాధికారములున్నూ, వేదవిద్యాభ్యాసనాధికారములుకలిగినట్లున్నూ, అస్త్రవిద్యయందును ఆకాశగమనవిద్యయందును మంత్రి జ్యోతిష మీమాంసాదిసర్వవిద్యలయందును, ప్రవీణలైనమానవతీమణులు పెక్కండ్రీ భారతమాతనలంకరించినట్లును, శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులయందున్నదనిగన్పట్టుడిని అంతియెగాక (తయోర్హామైత్రేయీబ్రహ్మవాదినీబభూవ) యను మైత్రేయి బ్రాహ్మణమునుబట్టి యాజ్ఞవల్క్యసిభార్య బ్రహ్మవాదినిగానుండెననుటనుబట్టియు గార్గిస్మృతియందుస్త్రీలు విద్యాధికులు పూజ్యులనుటనుబట్టియుజూడ పూర్వకాలంబున సకలవిద్యాసంపూర్ణులగు స్త్రీలీభారతభూమికి మండనముగానుండిరనుట యతిశయోక్తిగాదు కృతత్రేతద్వాపరయుగములలో విద్యాప్రవీణతగాంచిన స్త్రీలచా

రిత్రములను దత్సంబంధములగు నుదాహరణములను నా కు దెలిసినమట్టుకు విశదీకరించుచున్నాను గాననిందేదోష ములున్నను మన్నింప బ్రార్థించుచున్నాను.

1 గార్గియనుకాంత పూర్ణవిద్యనభ్యసించి తనపేరనొక ఉపనిషత్తుజెప్పెనని గానంబడుచున్నది.

2 కపిలుడు తనజననియగు దేవహూతికి సాంఖ్యశాస్త్ర ముపదేశించెనని భాగవతమునగానబడుచున్నది

3 దశరథమహారాజుకోడలును, శ్రీరామభూపాలునిల్లా లును పావనచరిత్రయునగు సీతాదేవితత్వశాస్త్రమం దారితేరి భర్తయాజ్ఞచే వాయుసుతునకు తత్వోపదే శమొసగినట్లుశ్రీ సీతారామాంజనేయ సంవాదమనే గ్రంధమునగానంబడుచున్నది.

4 సావిత్రియను సాధ్వీమణి తనపాతివ్రత్యమహిమచే యమునితోవాదించిమృతుడైన తనభర్తను పునర్జీవి తునిగాజేసి మరలదోడ్తెచ్చె.

5 అయోధ్యాపురవరాధ్యక్షుండును, రవికులసంభవుం డును త్రిశంకమహారాజుతనయుండునునగుహరిశ్చంద్ర

మహారాజసతియగు చంద్రమతియను పతివ్రత తనప
తివ్రతామహిమంబుచే జెచ్చెర కార్చిచ్చు జల్లార్చె.
మఱియు విద్యాజ్ఞానముగలదియగుటచే తనభర్తవి
శ్వామిత్రులవారికివ్వవలసినఋణంబునకై నక్షత్రకుఁడు
బాధించుసమయంబున ప్రాణపతీ నీవింతవిచారంబు
నొందనేల యాపదలొందినపుడు కులాంగననమ్మియా
పదనిస్తరింపఁజేయుట పరమధర్మంబు. భార్యనువిక్ర
యించిన పాపంబైనఁ బాపుకొనవచ్చునుగాని మిథ్యా
వాగ్దోషంబున్ బాయ నేరికిసాధ్యంబుగాదనువార్తో
క్తివిని సవే సత్యవాచాన్వితునికి సమానుఁడొకండుగల
డె. గావున నామీఁదిమోహాతమఃపుంజంబుఁద్రోచి కీ
ర్తివిస్ఫూర్జితంబగు సూనృతవాక్యసంపదన్ బొందెద
సేసి యీగాథేయుఋణంబుదీర్చుకొఱకు నన్నువిక్ర
యించిక్రయధనంబు తనికొసంగిన యర్ధఋణంబుదీరు.
కొదువఋణంబునకు మఱియొక యుపాయంబుగలదది
మీఁదనలందీరు, నిందుకుసందియంబొందకుము మనోహ
రా! మనకిట్టిదుర్దశసంభవించుట పురాకృతదుష్కృ

తఫలంబుగాని వేరొంకుగాదు అను మొదలుగాగల నసేక సుబోధనలను భర్తకాపత్యాలమందుపదేశించెను.

6 సకలసద్గుణపేటియగు సీమంతినీవధూటిభర్తదుఃఖదహ్యామానమానసయు మహావైధవ్యభీకరమృత్యుగ్రస్తయునై విద్యాగంధమెఱింగినదగుటచే దనమనంబున జింతించకయిట్లనితలంచె.

కం॥ పతులెక్కడసతులెక్కడ।
జతలెక్కడపూర్వకర్మజన్యంబులకున్ ।
బ్రతుకుతుద నెవరికెవ్వరు।
హితులహితులులేరు జీవులేగునుయతితో॥

7 విరటుండు తనకొమార్తెయగు నుత్తరయనుకన్యకామణిని రావించిబృహన్నలతో

ఆ॥ బాలకేళిమీఁదిభరముగ్రమంబున।
విడువగళలయందు వేడ్కజొనిపి।
నయముతోడనర్తనంబులశిక్షింపు।
నెలతకేమిగడయు నీవకావె॥

యను మొదలుగాగల వాక్యంబులచే నాట్యముగఉప
నప్పగించెనని భారతమునగాననచ్చెడిని.

8 అత్రిమహామునిభార్యయగు అనసూయతనపాతివ్రత్య
మహిమంబునహరిహరహిరణ్యగర్భులను పుత్రులను
గాగనె

9 నలచక్రవర్తిభార్య దమయంతియనుయింతితనపాతి
వ్రత్యంబున నొక్కబోయనుసిగుగావించె

10 కౌశికుండను విప్రునిభార్య తనపతివ్రతామహిమంబు
నచండమరీచి ననేకదినంబులుదయింపకుండయొనర్చె.

11 పూర్వము యోగికులాంగనయగు హేమలతయను చి
న్నదిసంపూర్ణవిద్యనభ్యసించి పతిభక్తినలుపుచుండ
కొంతకాలంబునకు దనవారినందరినిజంపి తన్నుచెర
బట్టవచ్చినరాజుకుచిక్కక రాజుచూచుండ తనపాతి
వ్రత్యప్రభావముచే ఆకాశమార్గమునకేగ శెను.
ఇట్టి దృష్టాంతములు జూపనెంచిన పెక్కులున్నవి.
యీకలియుగమున విద్యామహిమచే ప్రసిద్ధిగాంచిన
వారీమణులగొందఱిని నిచ్చటనుదహరించుచున్నాడ.

1 ఆంధ్రకవితాపితామహుండని బిరుదందిన అల్లసాని పెద్దన్న మనుచరిత్రమను గ్రంధమునురచించుచున్న సమయమందు దానినికొంతవరకుపూర్తిగావించిన పిదప గర్భిణీస్త్రీవర్ణనయేలా చేయవలయునో అదితన మనస్సుకుతట్టనందున దానినిగూర్చిఆలోచించుచుండగా ఆయనకుమార్తెఆభాగమును యెంతోనిపుణతతోపూర్తిజేసియిచ్చెనట ఆమెపాండిత్యప్రభావమునుచూడుడీ.

2 గణితశాస్త్రపండితుడైన భాస్కరాచార్యునికొమరితయగు లీలావతి తనజనకునియొద్దగణితశాస్త్రమభ్యసించిలీలావతీగణితమను గ్రంథమొకటిచేసెను.

3 కుమ్మరమొల్లయను స్త్రీ మృదుమధురశైలిని మొల్లరామాయణమునురచించి ప్రసిద్ధిబడసెను.

4 మండనమిశ్రుడను పండితునిభార్య సరసవాణియను యంగనామణి జననీజనకులచే బాల్యంబుననేసాంఖ్య పాతంజలవైశేషిక న్యాయమీమాంస వేదాంతములనెడియాఱుశాస్త్రములను మఱియు నితరవిద్యల

న్నియు నేర్చియుండి తనభర్తతో వాదింప వచ్చిన యాదిశంకరునంతవానితో బదునేను దినంబులహో రాత్రంబులు వాదించెనని చరిత్రలవలన గానవచ్చుచున్నది.

5 వాచియనునంగనబాల్యమందే వైధవ్యమొంది తన తండ్రియొద్దసంస్కృత విద్యనుచక్కగా నభ్యసించిదీర్ఘయాత్రలకరిగి యచ్చటచ్చటగల విద్వాంసులతో వాదించిగొప్పగొప్పసభలయందు మెప్పొందుటయే గాక వాచినాటకమను నొకసంస్కృతనాటకమురచించెనని గానబడుచున్నది.

6 యింక ననేకమంది రాజ్యపరిపాలన జేసినవారుగలరు అహల్యాబాయిహోళకరు మాళవదేశమున్నూ మహారాణీ ఝూశీలక్ష్మీబాయి బండిల్ ఖండములో ఒక భాగమునున్నూ మహారాణి లక్షమాన్ని మైసూరు రాజ్యమునున్నూ చాలాకాలమువరకు ప్రజానుకూలముగా పరిపాలించిరని దెలియుచున్నది.

యింకననేకమంది సుందరీరత్నములు పత్రికాధిప

తులును గ్రంథకర్తలును వైద్యశాస్త్రనిపుణులును గలరు ఇట్టి వారినందరిని వ్రాయంబూనినచో భారతమంతయగును

7 ప్రతినెలగడువు తప్పక హిందూసుందరియను మాసపత్రిక బహుచక్కనిసుందరులపటములతోను స్త్రీలకు విద్యాబుద్ధులు గఱపువ్యాసములతోను నోములు వ్రతములు పాటలు మున్నగు నవెన్నియో గల యీ మాసపత్రిక శ్రీమొసలికంటి రామాబాయమ్మగారిచే ప్రచురింపబడుచున్నది

8 శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు విద్యావతియై తనవిద్యనువినియోగపరుచుటకుగాను సావిత్రియను మాసపత్రిక కధిపతురాలుగనున్నారు ఈమె మహిళాకళాబోధినియను కావ్యమురచియించెను

9 శ్రీమతిబండారు అచ్చమాంబగారను కాంతామణి విద్యను చక్కగానభ్యసించి తనతోటివనితామణుల కుపయోగార్థమై అబలాసచ్చరిత్రరత్నమాలయను గ్రంథమును రచియించిరి.

10 ఇంకననేకమందిలలనారత్నములు శతకములు పాటలగ్రంథములు బిడ్డలనుబెంచురీతులు మొదలగునీతిబోధకములగు పుస్తకములు రచియించియున్నారు. గావున పురుషులకుగాని స్త్రీలకుగాని విద్యయుండి తీరవలయును యింకనుగొందరు మూఢశిరోమణులు స్త్రీలకు విద్యయుండినచో జారభర్తలకు పత్రములు వ్రాయుటకుపయోగపడునని యు యింకనెన్నియో లేనిపోని నిందలనువారిపైమోపి దూలనాడుదురు. విద్యాగంధమెఱుంగనిపుషులలో జారులు లేరా కాబోలు.

స్త్రీలువిద్యనేర్చియుండినపక్షమున పెద్దవారలు చెప్పినట్టువినుచు తోడివారలతోగయ్యాళులాడక కాలం వ్యర్థపుచ్చక పుణ్యసతులచరిత్రములజదివి వారివలెనెతామునవర్తించుటకు పాటుపడియెదరు యింకగృహకృత్యసంబంధమైనపనులెన్నియోచక్కబెట్టగల్గును. మరియుపతులయెడభక్తి సోదరులయెడ వాత్సల్యము తల్లిదండ్రులయందనురాగము పరోపకారమందాసక్తి భూతదయ ఈ మొదలగుసుగుణసంపత్తులు విద్యవల్లనేగల్గును, గావున

స్త్రీలకువిద్యలనవసరమని యెంచక విద్యావతులుగా జేయుటయే సద్వినయవివేక గుణసంపన్నులును స్త్రీవిద్యాభిమానులునునైన ధర్మాత్ములపనియైయున్నది.

సీ॥ స్త్రీలువిద్యలునేర్వ జెల్లునాయనయేల।
విద్యాధిదేవత వెలదిగాదె।
తగసాంఖ్యశాస్త్రంబు తననుసుచేసిన్న।
యలదేవహూతియు నతివగాదె।
గణితశాస్త్రమొనర్చి గణుతికెక్కినయట్టి।
లీలావతీదేవి బాలగాదె।
మునుజూక్కలనునేర్పుపునగు శిం చినయట్టి।
ఖానవాజమునామె కాంతగాదె।
గీ॥ వీరిప్రఖ్యాతులనుమీరు వినగలేదె।
చదువునేర్పుడుయొక్కనైన నరసులార।
స్త్రీలువిద్యలునేర్చిన చెడుదురనెడు।
తలపుమానంగవలయునో ధన్యులార॥

కాబట్టి స్త్రీలకన్నులబోగొట్టి యంధురాండ్రజేయవలెనని జెప్పుటకేబుద్ధిమంతులును సాహసింపరు. గాన

సతులజ్ఞాననేత్రములను దెఱవవలెననియు వారిమనోబల మభివృద్ధిఁజెందవలెననియు తలంచుతండ్రులారా!

సీ॥ ఏడతితాజదివిన పతిభక్తిగలిగియు।
పాపపుణ్యంబుల పథముదెలియు!
చానతాజదివిన చాలగాభర్తకు।
సకలకార్యములందు సాయపడును।
భామతాజదివిన బంధువులదనియించు।
పిల్లలపెద్దల క్షేమమరయు।
పొలతితాజదివిన పోరాటములుమాని।
పగలమొదలప్రీతి బరగుచుండు।
గీ॥ చేడెజదివిన నెప్పుడు క్షేమమొదవు।
కీడు లెవ్వియు నెన్నఁడు మూడబోవు।
కానఘనులార పురుషాగ్రగణ్యులార।
కాంతలకువిద్యనేర్పింప గడఁగవలయు॥

గాన స్త్రీవిద్యాభిమానులారా? మీశాలురొ క్కవిద్యనుగూర్చి మీరెంతశ్రమనుబొంది ఎట్లుపాటుబ చున్నారో అటులనేమీబాలికారత్నములకుగూడవిద్యా

మహిమను జెప్పింపవలెననియు ఇప్పుడైనను మనము మేల్కొని మనగృహములను భూలోకస్వర్గములుగా జేయ నెంచితిమేని సకలసౌఖ్యంబులనుభవింపనిచ్చ గలవారమైతిమేని విగామానసములసంఘాభివృద్ధియు ధనాభివృద్ధియు దేశాభివృద్ధియుగోఱతి గేని మెల్లమెల్లన దప్పటమగులిను చున్న స్త్రీవిద్యయనుకన్యను ప్రౌఢాంగనగానొనరింప ప్రపంచోద్ధారణమునకు పాటుపడి స్త్రీవిద్యాభివృద్ధిలోనికి పెచ్చెదరనిమిమ్మెల్లరను హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాడను. గానయిందేలోపములున్ననూ కలసియున్ననీటిని క్షీరమును తననిపుణతతో విడగొట్టి నీటిని ద్రోసివైచి క్షీరమునుమాత్రము హంసయేలాగునగ్రహించునో ఆలాగులనేనీతిపరులారా! నాయందనురాగముంచి యిందలితప్పులఁద్రోసివైచి యొప్పులనుమాత్రముగ్రహించమిమ్ములను వేడుకొనుచున్నాను.

ఇట్లు, స్త్రీవిద్యాభిమాని,

తులాబందుల చిన్నబ్రాహ్మణయ్య.

స్త్రీవిద్య—ఉపన్యాసమంజరి సంపూర్ణము.

# దేవాలయము నోటీసు.

గుంటూరు తాలూకా వడ్డేశ్వరఅగ్రహారంకాపరస్తులగు రాచపెరికెకులాలంకారుండును సత్రశలగోత్రపవిత్రక్షత్రికవంశపయఃపారావారరాకాసుధాకర కోటయ్యగారి జ్యేష్టపుత్రుడైన వెంకటప్పయ్యగారు. ఆయన జీవితకాలములో వడ్డేశ్వరంలో విష్ణాలయమును గట్టించి రామకార్యాధురంధరుండని ప్రతీతిపడసి దేవాలయప్రతిష్టజరిగిన కొన్నిదినములకు పరమపదమందుచూ యీరామాలయములో స్వామివారికి నిత్యనైవేద్యదీపారాధనలకై మాన్యమేమియేర్పాటుచేయకపోవుటచే తనతమ్ములైన శ్రీరాములు, పెదపున్నయ్య, చినపున్నయ్యలకు మొకవుయల్ నామా యీక్రిందవిధమున వ్రాసియున్నారు. యీరామస్వామి దేవాలయముకు నిత్యనైవేద్యదీపారాధనకై మాన్యం యేర్పాటులుజరుగక మున్నేనన్ను దేవుడుగొంపోవుచున్నాడుగాన మీరలుయీస్వామి

వారికి యీరోజున నేను వ్రుయల్ నామాగా వ్రాసిన రు 600-0-0న్నూ పెరుకలపూడి గ్రామకాపురస్తులును వా మేనమామగారైన సులాబందుల శ్రీరాములుగారు యీస్వామివారి మాన్యంనిమిత్తం రు 100-0-0లు యొసం గదసనివార్ద్రము జేసియున్నారు. గాన మొత్తం రు 700 లకు భూమివసతిగోరికిన్నపు యీధనము వెచ్చించిపల్లపు భూమిని యేర్పాటుచేయావలసినదని మేనమామగారైన సులాబాదుల శ్రీరాములుగారికి ఆజ్ఞ చేసియున్నారు. ఆభూమివసతికి వరకు యీగోకుండలమీదవచ్చేవ స్తులో స్వామివారికి నిత్యనైవేద్యదీపారాధనార్చకత్వము లు జరుపుతుండవలసినదనిన్ని వ్రాసియున్నారు యీందు లకుతమ్ములును మేనమామగారున్ను అంగీకరించియున్నా రు. వెంకటప్పయ్యగారు పరమపదమందియిప్పటికియేన్న ర్గముజరిగినది. ఇంతవరకు భూమియేర్పాటులుజరిగియుం డలేదు యింకను ఆయనజీవించియుంటేగనే వృత్సవిగ్ర హములకై గుంటూరులో 60 రూపాయిలు అడ్వాన్సు గాయిచ్చియున్నారు. కీర్తిమ్మతైనను మేనమామగారై

నను యింతవరకుఆవుత్సవిగ్రహములను చెప్పించి ప్రతిష్ట జేసినవారుకారు.

అటుతర్వాత యీ రామాలయమందుముందటభజనవగయిరాలు జరుగగలందులకై డాబాను గ్యాటుచేయమని వెల్లటూరిసుదర్శనముగారికి 116 రూపాయలకు కంట్రాక్టుకుయిచ్చియున్నారు ఆడాబా కొంతవరకుపూర్తిచేసి మొదువల్లనో పనులుచేయక సుస్తిగా ఉంచికున్నారు. గావునత్వరలో ఆపుణ్యమునుగారు ఆడాబాపని పూర్తిచేయించుదురగని కోరుచున్నాను వెంకటప్పయ్యగారితమ్ములు శ్రీరాములు పెదపున్నయ్య చిన్నపున్నయ్యలు తమ మేనమామ శ్రీరాములుగారితో ఏచ్చరిక జేసి ఆవుత్సవిగ్రహములనుత్వరగా జెప్పించి యీవచ్చే పరీధావి సం॥ చైత్రశుద్ధనవమినాటికైనను యుత్సవములజరిగించునట్లు చూచుచున్నారు.

వెంకటప్పయ్యగారిభార్యయగు చిలకమ్మగారు యీ స్వామివారిమాన్యవిషయమై ఆమెప్రోత్సాహంపుచ్చుకొని తన కొమారులతోనున్న తమ్ముడైన శ్రీరాములుగారితోను

న్నా జెప్పియీవచ్చేసంవత్సరములో యేవిధముగనైన మాన్యం యేర్పాటుజేసి ఆయనపేరునునిల్పి వీరుకీర్తిని బొందుదురని నేనుప్రార్ధించుచున్నాడను.

గీ॥ శ్రీరమానాధమీపదాంభోరుహములె।
శరణమనినమ్మిపుడమిపై సంచరించి।
యిపుడిలనుబాసి మీచెంతకేగినట్టి।
అప్పయకుమోక్షపదము నిమ్మాముకుంద॥

గీ॥ పుట్టగానేమిలెక్కయీపుడమిలోన।
మంచియశమున విలసిల్లుమానవుండు।
స్వర్గమునజాలభోగముల్ బడయుచుండు।
గానఅప్పయనీకట గల్గుముక్తి॥

కం॥ శ్రీరత్నాకరసరక।
న్యారమణకరీంద్ర రక్షనలినదళాక్షా।
కారుణ్యామృతహృదయా।
కోరితినీఅప్పయాఖ్య గానసన్నిధికి॥

ఇట్లు విన్నవించువిధేయుడు,

నంబూరు గ్రామం తులాబందుల చినబ్రాహ్మణయ్య

